శ్రీ

# గ్రంథావతారము

---

మ॥ ధరణిం బిల్లలమఱ్ఱివంశమణి యు
ద్యద్వేదవేదాంగసం
భరితుం డధ్వరసంచయార్పితహవి
ర్భాగాభిసంతోషితా
మరుఁడుర్విన్ శ్రీత్రిపురాంబికార్చకుఁడు స
న్మాన్యుండునా చంద్రశే
ఖర నామాంకిత యజ్వశేఖరుఁడు లో
కస్తవ్యుఁడై యొప్పెడిన్॥

ఉ॥ ఆపరమార్థవిత్తముని య
న్వయమందున విప్రరత్నమై

పాపనయజ్వగల్గి తలఁ
ప్పఁ బులిచింతలయగ్రహారముల్
భూపతి వేడఁగాఁ గొనియెఁ
బుత్రికలందునఁ జేరి భావలెం
తే పనిఁ దాల్చి బాల తన
యింటఁ జరించుఁ దపంబ దెట్టిదో॥

గీ॥ వెలయు పాపనయజ్వకు వేంకటపతి
సోమయాజి, లక్ష్మీపతి సోమయాజి
మనమలైరి లక్ష్మీపతి ఘనుఁడు గని యె
నతితపస్వి వేంకటకృష్ణ యజ్వవరుని॥

ఉ॥ వేంకటకృష్ణయజ్వకిల
వేరుసమానుఁడు గల్గఁడంచు ని
శ్శంకగఁ దెల్పవచ్చు గురు
శంకరుఁడాతని వందనంబుగా
జంకెను వేంకటాద్రిసృప
చంద్రుఁడు వచ్చి పరీక్ష సేయ ని

శ్శంకరతఁ జిత్రయోగముల
సల్పెను వారిప్రభావమెట్టిదో ?

కం॥ తగునని యిడఁగొనియె బుధుం
డగు వేంకటకృష్ణయజ్వ యన్వయమెల్లం
దగ జీవింపఁగఁగారణ
మగు మలకాపురము నగ్రహారముగాఁగ ॥

సీ॥ కలితయశుండు వేంకటపతి యజ్వతా
నుబ్బయాఖ్యానుఁడౌ సుతునిగాంచె
పరగనాబుధుఁడు సుబ్రహ్మణ్యమనుపుత్ర
వర్యుఁగాంచెను బుణ్యకార్యనిరతు
నంతసుబ్రహ్మణ్య మన్న పూర్ణంబోలు
నన్నమ్మయను కన్నెమిన్నయందు
నాగలింగంబు, కృష్ణయ పూర్ణసిద్ధాంతి
దక్షిణామూర్తినా దనరునట్టి
నందనచతుష్టయముఁగనె నందమొంద
నందుఁ బూర్ణయసిద్ధాంతి యఖిలదేశ

ములను సిద్ధాంతిమణియశమ్మును గణించి
యమలమతిని బ్రహ్మీభూతుఁడయ్యెఁదాను ॥

సీ॥ వసుధబిల్లలమఱ్ఱి వంశాబ్ధిచంద్రుండ
నంగనొప్పెడి నాగలింగమణికి
వితతసద్గుణగణాన్విత వేంకమాంబకు
నాత్మజులిరువురం దగ్రసుతుఁడు
సోమయాజులు బుధస్తోమమాన్యుఁడు మహో
ద్యోగయుతుండు పరోపకారి
యగ్రజసన్నిభుం డమలగుణుండు మా
నితకీర్తిబుధుఁ డాంజనేయశాస్త్రి
హితుఁడత్వచింతాభిరతు ములుకుట్ల వేం
కటకృష్ణనాముని గాంచినన్ను
తెలుపుఁడిటమాకు నిలువేల్పు త్రిపురసుంద
రీమహాదేవి స్తవమన, నే ముదంబు
గుదుర నక్షత్రమాలిక గూర్చి భక్తి
వెలయ జగదంబకిది సమర్పించినాఁడ ॥

చ॥ ప్రకటయశోవిశాలు రతి
భాసురభవ్యకళావిశారదుల్
వికసితరాజకీయ పద
వీ మహితాత్మకులైన సోమయా
జికి మఱి యాంజనేయునకు
శ్రీసుత భాగ్యచిరాయురాదులు
త్సుకతనొసంగి యాత్రిపుర
సుందరి బ్రోచుత నెలకాలమున్॥

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీత్రిపురసుందర్యై నమః

శ్రీ శివాయగురవే నమః

శ్రీగణేశ్వరాయనమః శ్రీ మహాసరస్వత్యై నమః



# శ్రీత్రిపురసుందరీనక్షత్రమాల

ఉ॥ శ్రీకరుణాకటాక్ష నత
సేవకపాలన బద్ధదీక్షుసు
శ్లోకమనీషిపక్షమణి
శోభితభూషణ వక్షభక్తవాం
ఛాకలనాతిదక్ష నిను
సంస్తుతిసల్పెద బ్రోవుమమ్మయ
స్తోకదయాబ్ధివై త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 1

చ॥ అజునకు సృష్టిశక్తి, దను
జారికిరక్షణశక్తి, నావృష
ధ్వజునకు సర్వసంహృతివి
ధాయకశక్తి నొసంగియెల్లఱుం
భజనమొనర్ప నిత్యమహి
మఁ వెలుగొందుచు నాదిశక్తివై
సుజనులబ్రోతువో త్రిపుర
సుందరిమంజుల కంబుకంధరీ॥ 2

చ॥ ధవుఁడఖిలజ్ఞుఁడీశుఁడు సు
త్రప్రవరుల్ సకలార్చనీయులుగా
నవతిమహాహాగ్రపాతకవి
నాశని గేహము వెండికొండనే
భవమున సర్వమంగళ వి
భాసురనాకొలు బోలియేలయుం
చు విడకుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 3

చ॥ అరయగ నామరూపముల
నందని పెన్మిటి, బెండ్లియాడినీ
నిరుపమశక్తి చేఁ బతిక
నేకవిధంబగు నామరూపముల్
విరచనఁజేసి పూజ్యవయి
పీడకయుంటివి నీచమత్కృతుల్
సారిదివిచిత్రమో త్రిపుర
సుందరిమంజులకంబుకంధరీ॥ 4

ఉ॥ వేదములాటపట్లువిధి
విష్ణుశివుల్ ప్రియనందనుల్, నిలిం
పాదులు సేవకుల్, స్థితిల
యాదులునీకువిలాసముల్, విశుం
భాదులుబొమ్మరిండ్లు, మహి
తాత్ములచిత్తమువాస, మజ్జతా
సూదననీకు శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 5

ఉ॥ అమ్మ, మొరాలకింపగద
వమ్మ, సదాగతివంచునిర్ణమదిణ
నమ్మితినమ్మ, పూర్ణకరు
ణంగనుమమ్మ, పరాకుబూనకో
యమ్మ, దయాబ్ధివమ్మ, శిర
ణంటిఁగదమ్మ, ధ్రువంబునిర్ణ విడం
జుమ్మనిశమ్ము శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 6

చ॥ కినుకనిరాకరింప నప
కీర్తిఁ, మొరల్ వినకున్న గర్వ, మ
న్యునిదరి జేరనీమవరు
వుండదు, జాలినిబూన్పధర్మమె
ల్లను జెడుఁ, గాననన్ను సుతు
లాగునగాంచి ప్రతిష్ఠనిల్పుమీ
నునుగొనకమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 7

చ॥ మొరలిడ నాదుచెంతకు వి
భుఁ విడి రామన సొప్పదో, నిరం
తరమును రాజితాద్రిపయి
తర్షలుదీరవా, యట్టులైన నీ
వరసహితంబుగా నిటకు
వచ్చి విరాజిత మన్మనోగిరిఁ
సురుచి వసింపుమో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 8

ఉ॥ పండితకోటులైనను భ
వత్సుఖకంద నితాంత నిర్మలా
ఖండ సరోజజాండ ముఖ
కారణ విస్మయ రూపమెన్న లే
కుండిరి నేనునేర్తునన
నొప్పునె, వాదనమాచరింతు దా
నుండని బ్రోవుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 9

చ॥ అరులకుఁ జూడమేమరభ
యావహ, మర్భకకోటి దృష్టికిన్
సురుచిర దివ్యమంగళము
నారులకున్ సకలార్థ మూలమున్,
నిరుపమ తత్త్వవేత్తలకు
నిత్యసుఖంబగు నీస్వరూపమే
సురలకు నెన్న నా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 10

చ॥ పురుషులు పూరుషార్థములఁ
బూని పనుల్ ఘటియించు వేళ నిః
స్థిరమతి నెంత్రుముం దఖిల
సిద్ధియొనర్చెదవంచు, నెల్ల మం
దిరముల సుందరీ మణులు
నిత్యసువాసినివంచు నిన్నదః
పారిది నుతింతురో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 11

చ॥ అభవునికొమ్మ, నన్నిటుల
నారడిబెట్టుట మేలటమ్మ, నీ
దు భజనమానసమ్మ, యిక
దోషములెన్నకుమమ్మ నాదు హృ
త్సభనిలుమమ్మ, దుర్గతుల
దార్చకుమమ్మ, నిరంతరంబునః
శుభములనిమ్మ, శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 12

ఉ॥ భక్తి గలుంగు వారలకు
భాగ్యము భోగ్యము కార్య ధుర్య ధీ
యుక్తిజనానురక్తి మహి
తోన్నతశక్తి సుభుక్తిముక్తినా
సక్తినొసంగు దాత్రివని
చాలగ వేడితి గాననాకిడఁ
నూక్తిఘటింపుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 13

చ॥ అతులిత సద్వరంబులిడు
నట్టి సురల్ గలరైనగాని యా
యితరులొసంగు తద్వరము
లెల్లను నీకొక గోటిలోనికిఁ
జతపడ, వింతయేల యల
చక్రిని గోళ్లను నిల్పలేదె యో
శ్రుతిఫథగోచరీ త్రిపుర
సుందరి మకజులకంబుకంధరీ॥ 14

ఉ॥ ఏ నొనరించుచుండుననవి
. మెల్లను పాపములైనగాని నే
వానికి భీతినొందనల
భానుఁడు గాఢతమంబువ్రోలె నీ
ధ్యానమడంచు గావునను
దాని నొనంగుము దోసిలొగ్గితిఁ
మానవిభాంగి శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 15

ఉ॥ పారముముట్ట వీవిషయ
వాంఛలు, మోహమడంగిపోవ, దా
చారముసున్న, నిల్వదెద
శాంతము, చిత్తమునిల్పజాల, ని
ష్కారణమైన నీకృపనుగాక
నినుంగననేర్చువాఁడనే
మారిజనేద్య శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 16

ఉ॥ పున్నె మొనర్చి యే నెఱుఁగ,
భూరితరంబగు పాపకార్యముల్
మిన్నక చేసినాఁడ, నిక
మీఁదెటులో, శరణంటినీకు, నా
పన్నశరణ్య! నాదయిన
ప్రాప్తమునీమనసెట్టులున్నదో
సున్ననుజుట్టకో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 17

చ॥ దురితపథంబునం జొరక
దుష్టమనంబెటునిల్పు? నీపదాం
బురుహసమర్చనంబునను
బుద్ధికినిల్కడయెట్లుగల్గు? నిర్జ
వరముల వేడఁగాఁదగిన
భాగ్యమదెప్పుడుగల్గు? దెల్పుమీ
స్ఫురితదయామయీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 18

చ॥ ననుసకలేశ్వరీ దృఢమ
నంబుననిల్పినుతింపలేవు నీ
యనకుము, కొండయంతటిమ
హాత్మునకుందగుఁ గొండయంతప
త్రినొసఁగువారలుర్విఁ గల
రేయొకదండమొసంగు వాఁడదా
సునిగనుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 19

చ॥ జననిరొనీదువర్ణనకుఁ
జాలినవస్తువు లేకయుంటనే
మనుచువచింతువాఙ్మనసు
లందవటంచురు సర్వలోకమో
హినివగునీదుచక్కదన
మీశుఁడుగాకితరుం డెఱుంగనే
ర్చునె? జగదంబ! శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 20

చ॥ ఎడ నెడదుర్గ్రహాంబులు మ
హీస్థలిపైబడి ప్రాణికోటులం
గడువడి బాధసల్పు నెడ
గ్రమ్మఱం దానకె బీజవర్ణముల్
నుడివినిరుక్ స్మరింపదహ
నుండుపయింబక మిత్తులట్లుగా
సుడివడిపోనె శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 21

ఉ॥ భూతినిబూసి, యాపురుక
పూసలుదాల్చి, శ్మశానవాటిలో
నేతిరుగాడు చుందిరిపై
మెత్తుచుఁబాములపేర్లుబూనుసీ
చేతనధీశుఁగా, శశిమ
ణీయుతుఁగా, బహుదాతఁగా, జగ
త్ఖ్యాతిఁగఁ, జేసితో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 22

చ॥ ఒకఁడిడెఁ బాదదానము, మ
ఱొక్కఁడుఁ దర్ధమొసంగె, నూఁడుపా
తికలిడె వేఱొకండు, వెలి
తింగొననీయక సర్వమిచ్చితి
వకలుషితాంతరంగయుతు
లైన మహాత్ములకంచు వేడితిఁ
శుకమృదువాణి శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 23

ఉ॥ కొందఱు శత్రునాశమున
కుఁ మఱికొందరు వైభవంబుకై.
కొందఱు పుత్రరాజికొఱ
కుఁ మఱి కొందఱు జ్ఞానవృద్ధికిఁ
గొందఱు భుక్తిముక్తులకుఁ
గొ త్రఫలంబు నొసంగి నీదు దా
సుందరి జేప్పనం ద్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 24

చ॥ అవిరళ దివ్యరత్నమకు
టాన్వితమై తిలకాభిరామమై
నవజలజేక్షణాద్వితయ
నంద్వితమై మణిభూషణాఢ్యమై
ప్రవిమల పూర్ణచంద్రువలె
భాసిలు నీ నగుమోము నాదు చ
క్షువులకుఁ జూపుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 25

ఉ॥ మంగళమూర్తివై సకల
మంగళముల్ ఘొనరించు నీకు నే
మంగళహారతుల్ విమల
మానసవీధి ఘటింతు నిత్యముఁ
మంగళముల్ ఘటించుచు న
మంగళముల్ దొలఁగించి నీదు దా
సుం గరుణింపుమం త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 26

ఉ॥ పావనచిత్తులై వెలయు
భక్తుల కాన్కల కాసఁబూనితా
నోవనజాయతాక్షి యిదె
యుత్పల చంపక మాలికాఢ్య తా
రావళి నిత్య నిర్మల స
మంచిత భక్తిని నీకొసంగితిన్
నూవె గ్రహింపుమో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 27

చ॥ కలితకృపాకటాక్షమునఁ గాంచుచుఁ బిల్లలమఱ్ఱి వంశ్యులన్ । విలసిత నాగలింగ బుధ వేంకమ్మ పుత్రులఁబ్రీతి సోమయాజులు మఱియాంజనేయుఁడను సోదరులన్ నినునమ్మికొల్చు దాసులమము నేలుమో త్రిపురసుందరి మంజులకంబుకంధరీ॥ 28

శ్రీత్రిపుర సుందరీ పరదేవతార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

